# స్వాతి స్రవంతి

(కథానిక)

వేసవికాలం.. మిట్టమధ్యాహ్నం.. సమయం దాదాపు రెండుగంటలు. దూరంగా కాకి అరుపు. తుమ్మ చెట్టు నీడలో నులక మంచం మీద జాగిలపడి రేడియో లో వస్తున్న పసిడిపంటలు వింటూ సొరకాయపులుసు త్రేన్పు సువాసనను ఆస్వాదిస్తూ నెమ్మదిగా నిద్రలో గతానికి జారుకున్నాను

పసుపుపచ్చ రంగు పరికిణీవోణీలో, స్వచ్ఛమైన బంగారు వర్ణ శరీర కాంతితో వెలిగిపోతుంది స్వాతి, మా వీధిచివరనున్న శాస్త్రిగారింటికి చుట్టంచూపుగా వచ్చింది. ఇంత అందగత్తె మా పల్లెకి రావడం ఎందుకో నా కోసమే అనిపించింది. అంతేకాదు, ఎలాగైనా తను నాకు వెంటనే కావాలనిపించింది. క్షణమాలస్యం చేయలేదు. ఎండిన పొలాల్లో గడ్డిమేట్ల మధ్య నవ్వుతూ, గెంతుతూ ఓ ఇద్దరు పిల్లల్తో దాగుడుమూత ఆడుతున్న తన దగ్గరకు నేరుగా వెళ్ళి తన పెదాలపై ముద్దుపెట్టాను. చాచిపెట్టి నా చెంప మీద చరిచి, అక్కణ్ణుంచి వెళ్లిపోయింది.

“ఉరేయ్, శుంఠ! అప్రాచ్యుడ! ఇంత మైల చేశావేంట్రా! ఉండు,ఈ శాస్త్రి నీకు తగిన శాస్తి  చేసి తీరుతాడు” చింతనిప్పుల్లాంటి కళ్ళతో, కోపంతో ఊగిపోతూ నా పొట్టభాగాన్ని లోడబాసం పెడుతూ, జుట్టును గుంజుతూ, చెంపలపై ఫెల్లుఫెల్లున చరిచాడు శాస్త్రి అతను కొడుతున్నాడు, కొడుతూనే ఉన్నాడు. ఇదంతా దూరంగా నిల్చుని చూస్తుంది స్వాతి, హేళనగా. ఒక్క క్షణం నా ఆపాదమస్తకం పాతాళంలోకి కూరుకుపోతున్నట్టనిపించింది.

కొద్దిసేపటికి, ఈ విషయం మా ఊరంతా దావానలంల వ్యాపించింది. అమ్మలక్కలు చెవులు కొరుక్కున్నారు. అయ్యన్నలు ముసిముసి గా నవ్వుకున్నారు. నాన్న చాచిపెట్టి తన్నాడు. అమ్మ తిట్ల దండకమందుకుంది. ఇంట్లోంచి బయటకొచ్చి వీధిలో నడుస్తున్న. నా వైపు జాలిగా చూస్తున్నవారు కొందరైతే, జాలిగా చూసేవారు మరికొందరు. నేరుగా ఎండిన పొలాల్లో కి వెళ్లా. గడ్డిమేట్ల మధ్య కూర్చుని కళ్లుమూసుకున్న, గౌతమ బుద్ధిడిలా

“రేయ్, పోలిసోడు మీ ఇంటికొచ్చాడు. నువ్వెక్కడున్న వెతికి వెంటనే ఇంటికి తీసుకురమ్మన్నాడు,” అమాయకంగా ఉన్న వాడి మొహంలో ఏదో పట్టలేని సంతోషం. వాడి వెనుకనే నడుచుకుంటూ ఇంటికెల్లా. పోలిసోడు లాఠీ తో వీధిలో నాలుగు దెబ్బలేసి, స్టేషన్ కు తీసుకెళ్ళాడు. ఎదురుగా ఎస్.ఐ. బెల్టు తీసి ఆరు దెబ్బలేసాడు. బయట నిల్చుని అమ్మ, నాన్న వారి చుట్టూ మరికొందరు. వీరెవ్వరి మీద పెద్దగా పడని నా దృష్టి మాత్రం ఒకే ఒక వ్యక్తి మీద పడింది. చెరసాలలోనుండి నావైపే తదేకంగా  నవ్వుతూ చూస్తున్నాడొకడు. నా మనసు మాత్రం వాడి మొహంలో స్వాతి ని చూస్తుంది.

అమ్మ ఎవరికి తెలికుండా డబ్బిచ్చి, కొంతకాలం ఊరికి దూరంగా వెళ్ళి బ్రతకమంది. చాలా నిర్మానుష్యంగా ఉంది రైల్వేస్టేషన్. దూరప్రాంతానికి టికెట్ తీసుకుని రైలు ఎక్కి కూర్చున్నాను. అకస్మాత్తుగా ఓ పొడవాటి వ్యక్తి వచ్చి నన్ను వంగోపెట్టి వీపు మీద గట్టిగా చరిచాడు. అరుపుని బిగబట్టాను. వచ్చినంత వేగంగా క్రిందికి దిగిపోయాడు. రైలు నెమ్మదిగా కదులుతుంది. కిటికీలోంచి

చూశాను. నాకు ఎదురుగా స్వాతి, ఆమె పెదాలపై ముద్దుపెడుతూ ఆ పొడవాటి వ్యక్తి . స్వాతి నా వైపు నవ్వుతూ చూసింది, అతని కళ్ళల్లో మాత్రం ఇంకా నా పై చల్లారని కోపం స్పష్టంగా కనిపించింది. కళ్ళు చెమర్చాయి. అలానే బయటకు చూస్తున్నాను. మా ఇల్లు, వీధి, శాస్త్రిగారిల్లు ఇలా ఒక్కొక్కటిగా నా నుండి దూరంగా వెళ్లిపోతున్నాయి. ఎప్పుడో స్వాతి వీక్లీ పుస్తకంలో చదివిన ఓ కొటేషన్ మదిలో మెదిలింది. శరీరానికి తగిలిన దెబ్బ శరీరాన్ని బలహీనపరుస్తుంది మనసుకు తగిలిన దెబ్బ మనసును ధృడపరుస్తుంది. బాధతో కళ్ళు మూసుకున్నాను. రైలు ముందుకు సాగిపోతుంది.

నులక మంచం మీద, నిద్రలోంచి లేచాను. రేడియో లో వనితావాణి కార్యక్రమం వస్తుంది. పైకి చూసాను.తుమ్మచెట్టు నిశ్శబ్దంగా నా వైపే చూస్తుంది. దానిపై రెండు కాకులు. వేసవికాలం మిట్టమధ్యాహ్న సమయం అవ్వడం వలన కనుచూపు మేరలో చడీచప్పుడు లేదు. సొరకాయపులుసు త్రేన్పు తో పాటు ఈసారి కొద్దిపాటి వెక్కిళ్లు. మంచినీళ్ళ కుండ కోసం కలియ చూస్తున్న నాకు "ఇగో బా నీ కోసం సల్లటి మజ్జిగ తీసుకొచ్చా, తొరగా తాగేసి ఈ ముంత ఇయ్యి , ఈలోగెల్లి ఏడిఏడి కాపి పట్టుకొత్త" అంటూ చల్లటి ముంత మజ్జిగ చేతికిచ్చింది స్రవంతి. అందుకుని తన అమాయకపు కళ్ళల్లోకి చూశాను. సిగ్గుతో మెలికలు తిరుగుతూ ప్రేమగా నా కళ్ళల్లోకి చూసి చూడనట్టు చూస్తుంది. త్రాగుతూ రేడియో లో ఎవరో చెబుతుంటే వింటున్నాను, 'Marriages are made in Heaven.' ముంత తీసుకుని, నా బుగ్గపై ఓ ముద్దిచ్చి, వడివడిగా, వయ్యారంగా అడుగులేసుకుంటూ వెళ్తున్న నా అర్ధాంగి స్రవంతి ని చూస్తూ, చిరునవ్వుతో నెమ్మదిగా పైకిలేచాను.

వరప్రసాద్

9533114111